TPLA121B183 ర్షు 2808
55

# పరీక్షాఫలితాలు

( పిల్లల నాటికలు )



రచన:

కె. సభా

కవితా పబ్లికేషన్సు
విజయవాడ-2.

2

కవితా ప్రచురణ నెం. 7
ప్రథమ ముద్రణ
ఆగష్టు 1957

వెల రు. 1-0-0

సంపాదకులు:

కనకమేడల వేంకట్రామయ్య.
నెప్పల్లి త్రివిక్రమరావు.

# పరీక్షాఫలితాలు

— పాత్రలు —

ఇస్మాయిల్

పీటర్

కైలాసం

అనంతం

విశ్వాసం

మాణిక్యం

పేపరుకుర్రవాడు

2/03

[వీధిమూల....ఒక సత్రం వసారా. ఆ వసారాలో ఒక చిరుచాపమీద ఇస్మాయిల్, పీటరు, కైలాసం, ఆనందం కూర్చుని దాయాలు ఆడుతుంటారు....]

ఇస్మాయిల్ :

(దాయాలు దొర్లించి) పన్నెండు.... (మళ్లీ దొర్లిస్తాడు) ఐదు....ఉండు ఉండు. (సర్దికూర్చుని దొర్లించి) రెండు....

కైలాసం :

చచ్చింది....చచ్చింది. దోరపండు చచ్చింది.... (చింతపిచ్చతో గళ్లు ఎంచి....ఎదుటివారి శనగగింజను తీసి మధ్య పెడతాడు....)

పీటర్ :

(దాయాలెత్తి దొర్లిస్తూ) ఆరు....రైటో,...రైటు.... (మళ్లీ దొర్లించి) అరెరె మూడే....నాలుగు పడి ఉంటే తెలిసిఉండేది కథ....

ఆనంతం :

పోనీ....అదెక్కడ తప్పకుంటుందో చూద్దాం...

[మాణిక్యం....విశ్వాసం ప్రవేశించి]
(ఇద్దరూ ఒక్కసారిగా....)

మాణిక్యం : విశ్వాసం :

ఏమిట్రా పేపరింకా రాలేదూ?

వి శ్వా స ం :

అవునురేయ్....ఈ దినం రిజల్ట్సు వేస్తారుగా....

అ న ం త ం :

నేనూ మఱచి పోయాను.

పీ ట ర్ :

నాకు తెలుసులే....అందుకే ముందుగా వచ్చి కూచున్నాను.

ఇ స్మా యి ల్ :

నేను నిన్ననే యిచ్చేశాను మూడు పత్రికలకు మూడణాలు బస్సు కండక్టరు దగ్గఱ ముందుగా తెమ్మని....

మా ణి క్య ం :

మూడెందుకురా....

విశ్వాసం:

ఒకదానిలో లేకున్నా ఇంకోదానిలో లేకున్న యింకోదానిలో ఉంటుందనేమో....

పీటర్:

నీ ముఖం....అన్ని పేపర్లో పడేవి ఆ నంబర్లే....

అనంతం:

పడు తుం దుండ వయ్యా పీటర్ మహాశయా!

పీటర్:

పడకేం జేస్తుందిలే....కోటిం గంతా కాగితంలో వ్రాసుకొని కిక్కురు మనకుండా ఫుల్‌స్టాప్ కామాలతో వ్రాసి వస్తే....

అనంతం:

అవు నవును....చొక్కాయకు లోపలి ప్రక్క పెన్సిలుతో చేటడెడల్పు ఆన్సరు రాసుకపోయిం దెవరూ చూడ లేదనేనా?

పీటర్:

చూడకేం....ఇంగ్లీషునాడు గ్రామర్ బుక్కు బాత్ రూములో దాచిపెట్టి విరేచనాలు పట్టుకుందని

లైటిన్ తలుపులు మూసుకొని పావుగంట బైటికి రాలేదుగా....

అ నం తం:

ఆ మాటకు వస్తే కాపీ కొట్టని వాడె వడంట...

వి శ్వా సం:

అందరినీ కలుపుతా వెందుకూ?

అ నం తం:

ఆహా! విశ్వాసంగారూ...ఆగండి. మీ విశ్వాసం ఎలాంటిదో బయటపడితే బావుండదు.

వి శ్వా సం:

ఏం చేశాను....నీలాగా....

అ నం తం:

నా లాగా కాదు కానీ. ప్రక్కన కూర్చున్న విశాల లెక్కల పేపరు....

వి శ్వా సం:

ఆగరా....ఆ గొడ వెందుకులే....

ఇ స్మా యి ల్:

చెబితే పరువు పోతుంది.

పీ ట ర్ :

అసలు పరువంటూ ఒకటి ఉంటేగా....

అ న ం త ం :

అసలిక్క డెవరున్నారులే వినడానికి....

కై లా స ం :

మీరేం కాపీ కొట్టారులే మీ ముఖం అసలు కాపీ కొట్టే విధానమే మీకు తెలియదు.

మా ణి క్య ం :

అదే నిజం....

కై లా స ం :

మన మాణిక్యం ఏంచేశాడో తెలుసా ?

మా ణి క్య ం :

కొంప దీసి చెప్పేసేవు.

పీ ట ర్ :

ఏదో నీ పుణ్యాన చెబితే రేపు యూనివర్శిటీ పరీక్షల్లో ఉపయోగించుకోవచ్చు.

వి శ్వా స ం :

మాణిక్యం విజ్ఞానాన్ని విద్యార్థి లోకమంతా మెచ్చుకొంటుంది.

ఇ స్మా యి ల్ :

ఆ ఉపాయం ఎవరికీ తెలియదేం....మనీపర్సులో కాగితా లెత్తి పెట్టుకోవడం....

పీ ట రు .

కాదు....కాదు .... మేజోళ్లలో దాచుకుంటే ఎవ్వరూ చూడరు....

అ నం త ం :

పోయిన సంవత్సరం రంగారా వేం చేశాడో తెలుసా అరచేతిలో వ్రాసుకు పోయాడు సన్నంగా

వి శ్వా స ం :

కోదండం గోళ్లమీద వ్రాసుక పోయాడురా బాబూ బి. సీలు....ఏ. డీలు సంవత్సరాలు.

ఇ స్మా యి ల్ :

శ్యామల ఉండేదే థర్డుఫారంలో....ఆ పాప రిబ్బన్‌లో ఒక లెక్క వేసుకొచ్చిందిరా బాబూ ఆ సైన్సు మాస్టారు నరసింహారావు పట్టుకొనే శాడు...

కై లా స ం :

అదిగాదు గానీ తమాషా....హాఫియర్లీ ఎక్జామి నేషన్సపుడు వాడున్నాడే చెంగల్ రాయుడు

డెస్కుమీద ఎప్పుడు రాశాడో ఎనిమిది పద్యాలు చల్లగా చూచి వ్రాసుకొంటుంటే....

విశ్వాసం :

అవు నవును. వెంకటరెడ్డి అయ్యవారు పట్టు కున్నారు గదూ....

పీటర్ :

ఓనాడు లెక్కల టెస్టులో

ఇస్మాయిల్ :

కేశవుని కథే గదూ....

మాణిక్యం :

వా డసాధ్యుడు.

పీటర్ :

తెలుగు మాస్టారును ఏమారుద్దా మనుకున్నాడు. ఆయన రకీమని కనిపెట్టేశాడు.

ఇస్మాయిల్ :

ఐనా వాడి దుంప తెగ....ఎంత సన్నక్షరాలు రా... స్కేలు నిండుకూ వ్రాసుకొన్నాడు.

పీటర్ :

ఒక్క స్కేలేమిటి నీ బొంద. వాడంతకు ముందు పెన్సిల్ మీదనే ఇంగ్లీషు పద్యం వ్రాసుకోచ్చాడురా

కై లా స ం :

ఇంతకూ మాణిక్యం ఎలా కాపీ కొట్టాడో చెప్పడేం....

మా ణి క్య ం :

ఆఁ....నా పద్ధతి మీకు నచ్చదులే....

పీ ట ర్ :

ఆయనగారికి దివ్య దృష్టి ఉందేమో....అలా కళ్లు మూసుకొంటే ఇలా పుస్తకం, ఒక్కొక్క పేజీనే కన్పిస్తుంటుంది.

ఇ స్మా యి ల్ :

వైర్ లెస్ లాగా ఏదో మిషన్ కనిపెట్టాలిరా...

వి శ్వా స ం :

కనిపెట్టి ?

ఇ స్మా యి ల్ :

ఇక్కడ సూపర్‌వైజరుకు తెలీకనే అక్కడ ఎవరితో నో మాట్లాడాలి. ఆన్సర్లు చప్పున తెలిసి పోతాయి.

విశ్వాసం :

ఆ యంత్రాలు కూడా ఒకరి కంటికీ కనిపించ కూడదు సుమా!

ఇస్మాయిల్ :

కన్పిస్తే కనిపెట్టేం లాభం....

పీటర్ :

ఇన్ని ఆటం బాంబులు హైడ్రోజన్ బాంబులూ కనిపెట్టారని చెబుతున్నారే....ఇలాంటి మిషన్ ఒక్కటి కనిపెట్ట గూడదూ ?

కైలాసం :

ఏం మాణిక్యం? నీ కాపీ కొట్టే పద్ధ తేదో చెప్ప రాదూ....

మాణిక్యం :

ఇంట్లో చదవడం బడికివచ్చి రాయడం....

కైలాసం :

అదెట్లా....

మాణిక్యం :

కాపీ అంటే ముందు పెట్టుకొని ప్రతి లైనూ చూచి మళ్లీ వ్రాయడమేకాదు....అది కష్టం కూడా.

పుస్తకమంతా చదవడం దాన్ని ఇంట్లోనే పడేసి అందులో అడిగినదాన్ని జ్ఞాపకం పెట్టుకొని వ్రాయడం.

కై లా సం :

అది అందరికీ తెలిసిందేగా ఆబాధ పడలేక నేగా ఈ బండాటలు ?

పీ ట ర్ :

మాణిక్యం మహాశయా అంత జ్ఞాపకంతో వ్రాసే నా లెక్కల్లో ఫల్టీ కొట్టారు.

వి శ్వా సం :

అసలు రైటు రెండేనటగా....

మా ణి క్యం :

మిగిలిన ఎనిమిది లెక్కలకూ స్టెప్పుకు మార్కులు వస్తాయి.

వి శ్వా సం :

నావి ఎనిమిదికీ నాలుగు రైటు ఆన్సర్లు....

మా ణి క్యం :

స్టెప్పు లేకనే ఆన్సర్లు మాత్రం కాపీకొట్టి వేస్తే మార్కులు వచ్చే స్తా యను కున్నావేం ?

విశ్వాసం:

చూసేవాడు టకటక మని ఆన్సర్లు చూస్తూ రైటు మార్కు లిచ్చుకుంటూ పోతాడుగాని ఒక్కొక్క స్టెప్పే చూస్తాడేం....

మాణిక్యం:

అసలు లెక్కలయ్యవార్లేం చెప్పారో తెలుసా? అన్ని సబ్జక్టులో ప్రతి పేరాకూ మార్కు లిచ్చిన ట్లే లెక్కల్లో ప్రతి స్టెప్పునకూ మార్కులుం దన్నారు.

పీటర్;

ఏమిటి.... ఈ పేపరు కుర్రాడింకా రాలేదేం? గంట పదైపోతుంటే.

ఇస్మాయిల్

అందుకే చంద్రుడూ వాళ్లంతా రాత్రే చిత్తూరికి పోయారు. వేకువ జామున్నే అందుకోనుంటారు పత్రికలు....

(తెరలో సైకిల్ బెల్)

పీటరు:

అరే....వెనుకప్రక్క నుండి వస్తున్నాడేం....

ఇస్మాయిల్ :

ఓహో ! ఆ మలుపు తిరిగి వస్తున్నాడు కావాలి.

(సైకిల్‌తో పేపరు కుర్రాడుప్రవేసించగానే కట్టవిప్పి తలో దినపత్రిక అందుకొంటారు. ఒక్క మాణిక్యం మాత్రం వెనక తగ్గి ఉంటాడు—)

ఇస్మాయిల్ :

(అదరుతూ)

అరే.. నానెంబరు.. 19830 కదూ.., ఆ... రాఁ....

పీటర్ :

ఇదు గోరా 19810. నుండి . . ,

విశ్వాసం :

పదేను వరకూ ఉంది . . .

ఇస్మాయిల్ :

మళ్లీ ఇరవై ఒకటి నుండి ఇరవై ఐదువరకూ...

పీటర్ :

ఒరేయ్ మళ్లా 31 ఉందిరా . .

విశ్వాసం :

ఈ మధ్య . . 26 నాదేగా

పీ టర్ :

నాది ఇరవై యేడు.

కై లా స ం :

నాది 28.

అ న ం త ం :

నాది 29.

ఇ స్మా యి ల్ :

నాది ముప్పై . . .

మా ణి క్య ం

నాది ముప్పై ఒకటుందిగా . . .
(అందరూ అతనివంకా తీవ్రంగా చూస్తారు....)

మా ణి క్య ం :

(పేపరందుకొని ఎంచుతాడు. ఒకటి నుండి యాభై రెండు వరకూ ....)

వి శ్వా స ం :

ఏమిట్రా ఆ లెక్క . .

మా ణి క్య ం :

మొత్తం మనబడిలో 84 మందికి యాభై రెండు మంది ప్యాసు . . .

పీ ట ర్ :

ఏయ్ .. (సైకిల్ కుర్రవానితో) నీదగ్గఱ ఇంగ్లీషు పత్రిక లేదూ ..

ఇ స్మా యి ల్ :

చూడరా ఈ తెలుగు పత్రికల్లోకంటే ..

మా ణి క్యం :

అన్నీ ఒక్కటేగా ..

వి శ్వా స ం

షటప్ .. నీకెందుకు రా ఆ విషయం ... (కుర్రవాణ్ణిచూచి) ఏదీ హిందూ (అంటూ చిల్లరిచ్చి తీసుకుంటాడు....)

పీ ట ర్ :

ఒక మెయిల్ యిలా పడెయ్. (చిల్లరిచ్చి అందుకొంటాడు....)

అ న ం త ం :

ఎక్స్ప్రెస్సివ్వరా .. (చిల్లరిచ్చి అందుకొంటాడు....)

కై లా స ం

ఇప్పుడు నిదానంగా చూడండీ ...

విశ్వాసం;

పందొమ్మిది . . పందొమ్మిదీ . . . ఆఁ . . .
ఆఁ , . .

అనంతం:

ఏరా . . . ఏరా . . .

విశ్వాసం:

కాదురా , . .

పీటర్ :

పోయిందిరా .... (నేలకేసి కొడ్తాడు పేపరు....)
పేపరు కుర్రాడు వెళ్లి పోతాడు నవ్వుతూ....

అనంతం

ఇందులోనూ లేదు....

విశ్వాసం:

ఇంటికి పోతే మడి కట్టుకొని వంట చేయరా....
నీకు చదువు వంట బట్ట దంటుంది బామ్మ....

పీటర్

అక్కడికి నయంరా నా తండ్రీ ఈరోజు వీపు
విమానం మోత మోగిందనుకో.

కై లా స ం

మా నాన్న యీ వాళకే చూచి ఉంటాడు. ఇంటికి పోతే యింకేముంది?

అ న ం త ం :

అంత భయపడటం ఎందుకూ....యం.యస్.యం సర్వీసుందిగా.

ఇ స్మా యి ల్ :

అంతా పాసైతే యింక పరీక్ష లెందుకూ?

అ న ం త ం :

ఒరే కైలాసం....

కై లా స ం :

నన్ను మాట్లాడించకురా అనంతం? (నెత్తిన చేతుల పెట్టుకొని కూచుంటాడు)

వి శ్వా స ం :

పీటర్....

పీ ట ర్ :

చెడిపోయిందిరా విశ్వాసం.... నాలుగు కాలేజీల కష్టె చేశానురా....

విశ్వాసం:

ఆ కథెందుకులే....మా మామయ్యా తిరుపతి నుండి జాబు రాశాడు కాలేజీ తెరవకముందే రమ్మని....

అనంతం:

వెళ్లు నాయనా! వెళ్లి గుండు కొట్టించుకురా

మాణిక్యం:

(నవ్వుతాడు)

విశ్వాసం:

నవ్వరా....నవ్వు....ఎందుకలా పొంగుతావ్.... పొంగే దంతా పొయ్యిపాలే.

కైలాసం:

ఒరే విశ్వాసం.... (దూరానికిచూచి....)అక్కడొచ్చే దెవఱ్ఱా....

విశ్వాసం:

సైన్సు మాస్టారల్లే ఉంది....ఆ తలుపు తియ్.... సత్రం లోపలికైనా పోదాం. వస్తే పరువు తీసేస్తాడు....

(తెలిలోకి వెడుతుండగా....)

మా ణి క్యం :

సార్ సార్....నేను పాసయ్యాను సార్....
(ఇంకోవైపుకు వెడుతాడు)

[ తె ర ప డు తుం ది ]

# ముంతకు చెవులు

— పాత్రలు —

సత్యం

వైదేహి

విజయ

నిర్మల

# ముంతకు చెవులు

[సత్యం విజయుడు గోలీలు ఆడుకుంటారు....ఒక వీధి పంచలో]

సత్యం :

(గోలీతో గోలీని గురిచూచి కొట్టి) ఒక్కాసి కొక్కు.. (మళ్లీ కొట్టి)రెంటికి మేళం....(మళ్లీ గురి తప్పుతుంది)

విజయుడు :

ఉండుండు....నాది మూటికి మొగ్గ.... (గురి చూచి....కొట్టి) నాలుగు తాళం.... (మళ్లీ గురిచూచి ....కొట్టి) ఐదో పంచాంగం....

సత్యం :

అన్నీ తగుల్తు న్నాయే....

విజయుడు :

(గురిచూచి....కొట్టి) ఆరింటికి రాసి.... (తప్పు తుంది గురి.) పోయిందిరా,...

స త్యం :

(గురిచూచి....) పోయిందే.

వి జ యు డు :

ఆ.... (గురిచూచి కొట్టి)
ఏడింటికి మేడ.... (మళ్లీకొట్టి)
ఎనిమిదో మెట్టు.... (మళ్లీకొట్టి)
తంబాకు దుగ్గు.... (తప్పుతుంది)

వి జ యు డు :

ఉండరా (కొట్టి)
మూటికి మొగ్గ.... (కొట్టి)
నాలుగు తాళం.... (కొటి)
ఐదో పంచాంగం.... (తప్పుతుంది) చా....చా....

స త్యం :

తంబాకు దుగ్గు....తంబాకుదుగ్గు....(రాగంతీస్తూ....
గురిచూసి కొడ్తాడు) తసికిరిపెట్టు .... రా .... రా
డోకూ.... డోకు రన్నా.... డోకూ....

వి జ యు డు :

ఒరే మోచెయ్యి నొప్పిరా....

స త్యం :

అందుకు నన్నేం చెయ్య మంటావ్....

వి జ యు డు :

సరే.... (గోలీని మోచేత్తో వంగి తోస్తుండగా వైదేహి.... నిర్మల ప్రవేశిస్తారు .... చేతిలో పుస్తకాల సంచు లుంటాయి....)

ని ర్మ ల :

ఇంకా బడి గంట కొట్టలేదూ....

స త్యం :

లేదు....లేదు....

వై దే హి :

ఈ దినం సాయంత్రం బళ్లో మేజిక్కు చేస్తా డటగా ఎవరో....

వి జ య :

అవునవును. బలే మేజిక్కు చేస్తాడట. ముందు బొరుగులు చూపించి....వాటినే మిఠాయి చేస్తా డట. క్షణంలో ఆ మిఠాయిని మట్టిగా చేస్తా డట.

ని ర్మ ల :

అట్లాంటివి వైదేహి నిమిషంలో చేస్తుంది.

స త్యం :

ఆహా! అద్భుతంగా చేస్తుంది. ఐతే కళ్లు మూసు కోనే చూడాలి.

ని ర్మ ల :

వైదేహీ! నాకు దారిలో చెప్పావే దాన్ని చేసి చూపుతావ్....

వై దే హి :

పందెం వెయ్యాలి. ఊరికే చేయడ మెందుకూ?

వి జ య :

ఏమిటి పందెం?

ని ర్మ ల :

పది పిప్పరమెంట్లు.

వి జ య :

అసలు ఫీరు చెయ్యబోయే దేమిటి?

ని ర్మ ల :

ముంతకు చెవులు చూపిస్తాం....

స త్యం :

(ఎగిరి గంతేసి) ముంతకు చెవులే....

ని ర్మ ల :

అవును....

వి జ య :

"కథకు కాళ్లు లేవు. ముంతకు చెవుల్లేవు" అన్నారు మాస్టరు గారు.

వై దే హి :

అవన్నీ ఎందుకు ముంతకు చెవులు చూపిస్తాము....

స త్యం :

ముంతకు చెవులు చూపిస్తారూ...ఎన్ని చెవులు.

వై దే హి :

రెండు చెవులు చూపుతాను:....

వి జ య :

ఆ చెవులు వినిపించు కొంటాయా ?

వై దే హి :

ఆహా ! వాటికేం చెవ్వుడులేదు. ఉ౦టే గి౦టే చెవుడు నీచెవులకే...

విజయ :

ఐతే చూపించు, పది పిప్పర్ మెంట్లేమిటి కర్మ.... ఇరవై యిస్తాను.

నిర్మల :

ఈసారి బాగా విను వై దేహి ముంతకు చెవులను చూపుతుంది. ఆమె ముంతకు చెవులు చూపితే నువ్వు ఇరవై పిప్పరమెంట్లు యివ్వాలి. చూప కుంటే నీకు ఇరవై పిప్పరమెంట్లు ఆమె యిస్తుంది.

సత్యం :

ఏం పిప్పర మెంట్లు ?

నిర్మల :

పేరిస్. స్ట్రాంగ్ పిప్పర మెంట్లు.

విజయ :

ఆ చెవులు మనుష్యుల చెవుల్లాగే ఉండాలి.

నిర్మల :

ఆహా! నా చెవుల్లాగే ఉంటాయి. మనం మాట్లా డితే వాటికి వినబడతాయి కూడా.

వి జ య :

నోరు కూడా చూపుతావా ?

ని ర్మ ల :

ఎందుకు చూపనూ? నీవు చూపమంటే చూపు తాను. నేను నోరు చూపుతాను. వైదేహి చెవులు చూపుతుంది.

స త్యం :

ముక్కు....

వై దే హి :

ఒక ముక్కేమిటి? కన్నులుకూడా. అవసర మైతే జడకూడా....

వి జ య :

ఇంతకూ ఆ ముంత ఎక్కడుంది?

స త్యం :

మేము చూపిన ముంతకే చూపాలి.

ని ర్మ ల :

అలాగే.

స త్యం :

ఐతే క్షణం ఆగు....ముంతను తీసుకవస్తాను.

ని ర్మ ల :

ఈసారి పందెం జ్ఞాపకం చేసుకో. ఇరవై పిప్పర మెంట్లు....

వి జ య :

ఇరవై యేమిటి. వందకూడ యిస్తాం. చూపకుంటే మీ రివ్వాలి.

ని ర్మ ల :

అలాగే....తీసుకు రమ్మను ముంతను.

స త్యం :

ఇదో తెస్తాను....(తెలలోకి వెడుతాడు)

వి జ య :

అంతా అబద్ధం. ముంతకు చెవులా?

ని ర్మ ల :

కండ్లు కూడా....

వై దే హి :

నోరు కూడా చూపుతా మన్నాముగా.

వి జ య :

ఉండండి....ఉండండి (సత్యం ముంతను చేత్తో పట్టు
కొని వస్తాడు....)

వి జ య :

(ముంతను చేతితో అందుకొని) ఈ ముంతకు చెవులు
చూపిస్తావా వైదేహి....

వై దే హి :

అవును....

వి జ యు డు :

ఏదీ చూపించు....

వై దే హి :

అలాగే పట్టుకో....మీరంతా ఒక్కసారి కళ్లు
మూసు కోండి....
(అందరూ కళ్లు మూసి తెరుస్తారు....)

వై దే హి :

ఆ ముంతను పైకెత్తి పట్టు....

వి జ యు డు :

(పైకెత్తుతాడు)

వై దే హి :

అంతా చూస్తున్నారా?

అం ద రు :

చూస్తున్నాం.

వై దే హి :

ఇదో చూపుతున్నాను. ఆఁ....ఆ....కొంచెం ప్రక్కకు నిలబడు....

వి జ య :

ఎంతసేపు....చూపించు....

వై దే హి :

ఇదో చూడండి (ముంతకు ఎదురుగా నిలబడి తన చెవులను చూపుతూ) నేను ఆ ముంతకు చెవులు చూపాను....

ని ర్మ ల :

(ఎదురుగా నిలబడి తన ముక్కు చూపుతూ) నే నా ముంతకు ముక్కును చూపాను.

వై దే హి :

నేను కన్నులుగూడా చూపాను.

నిర్మల :

ఇదిగో జడను కూడా చూపాను....

విజయ :

మోసం....మోసం....

సత్యం :

పచ్చి మోసం...

నిర్మల :

ఎందుకు చెప్పండి....అసలు పందె మేమిటి?

విజయ :

ఏమిటో నువ్వే చెప్పు...

నిర్మల :

ముంతకు చెవులు చూపిస్తామన్నాం....

విజయ :

మీ చెవులనా?

నిర్మల :

పందెంలో చెప్పిన మాటలో ఏముంది? ముంతకు చెవులు చూపుతామని ఉంది. అంతేగాని ముంతకు చెవులు మొలిచాయని చెప్ప లేదే....

వి జ య :

పాపం! ఏమార్చి పిప్పరమెంట్లు కాజేద్దామను కున్నారు.

స త్యం :

ఏ మారే వాళ్ళుండ వద్దూ?

ని ర్మ ల :

మాట తప్పుతున్నారు...

వై దే హి :

ఇవ్వడానికి లేకుంటే లేదనాలి...

స త్యం :

నిజమే... ఏమారి పోయాం.

ని ర్మ ల :

ఐతే యిచ్చేయండి...

స త్యం :

కావలిస్తే ఆ ముంతను తీసుకోండి...

వై దే హి :

మాకెందుకూ మీరే తీసుకోండి.

(బడిగంట వినబడు తుంది)

స త్యం :

అరెరే గంట కొట్టేశారు... (పరుగు తీస్తాడు)

వై దే హి :

మొండి...మొండి...జగమొండి...

(అందరూ వెడుతారు తెఱలోకి)

[ తె ఱ ప డు తుం ది ]

---

# తలకప్పు

— పాత్రలు —

ప్రతాపుడు

చంద్ర

గంగాధరం

స్కూల్ మాస్టరు

బసవయ్యతాత

# తలకప్ప

(ఒక గదిలో చిన్నపాప, దీపముముందు కూర్చొని ప్రతాపుడు, చంద్ర చదువు కొంటుంటారు....)

ప్రతాప్ :

ఎప్పుడు సంపద గలిగిన
నప్పుడు బంధువులు వత్తురది ఎట్లన్నన్
తెప్పలుగ చెఱువునిండిన
గప్పలు పది వేలుచేరు గదరా సుమతీ....

చంద్ర :

కప్పలు పదివేలు ఏమిట్రా! ఈయనేం ఎంచినట్లుందే?

ప్రతాప్ :

పదివేలు కాకుంటే లక్షను కో....

చంద్ర :

లక్షేమిటి? రెండక్షరాలు. వానకురిస్తే చూడాలి. అసలు అవి యెలా అరుస్తాయో తెలుసా?

ప్ర తా ప్ :

ఏది అరువు చూద్దాం ?

చ ం ద్ర :

అమ్మబాబో ! తాతయ్య వింటే ఇంకే ముంది ? చితక దంచేస్తాడు....

ప్ర తా ప్ :

మెల్లగా అరిస్తే వినబడదులే....ఉండుండు....ఆ తలుపు కొంచెం ఓరగా నెట్టి వస్తాను (తలుపును మూసివచ్చి కూర్చొని) ఇప్పుడు కానివ్....

చ ం ద్ర :

పెద్ద కప్ప ఉంటుందే గోండ్రకప్ప. అది గోండ్రు .... గోండ్రు గోండ్రు .... గోండ్రు అంటుంది.

ప్ర తా ప్ :

(పెద్దగా నవ్వి) ఇంకోటి....?

చ ం ద్ర :

కొంచెం చిన్నదిలే అది బేరం చేస్తుంది.... బేరం .... బేరం....బేరం....బేరం....బేరం .... బేరం అంటుంది....

ప్ర తా ప్ :

ఇంకా....

చం ద్ర :

ఇంకోటుంది లే అది డోలుకప్ప.... డోగరం.... డోగరం ....డోగరం....డోగరం....డోగరం.... డోగరం....

ప్ర తా ప్ :

ఊఁ....తుడుం కప్ప ?

చం ద్ర :

డుముకు డుముకు ఢుం .... ఢుం .... ఢుం .... డుముకు డుముకు ఢుం....ఢుంఢుం....ఢుంఢుం ఢుం ఢుముకు .... ఢుం ఢుం ఢుం ఢుముకు.... ఢుం....ఢుం....ఢుం........

తా త య్య :

(లోపలనుంచి దగ్గుతూ) ఏమిట్రా చదువుకోక .... వచ్చానంటే చర్మం ఒలిచేస్తా....

చం ద్ర :

ఎప్పుడు సంపదగలిగిన
గప్పలు పదివేలుచేరు గదరా

ప్ర తా ప్ :

తెప్పలుగ చెఱువునిండిన
అప్పుడు బంధువులువత్తు రదిఎట్లన్నన్.

చం ద్ర :

ఓరేయ్! తలకప్పను చూశావ(టా ?

ప్ర తా ప్ :

ఎందుకు చూళ్లేదు ? చేపల్లాగే ఉంటాయిగా....

చం ద్ర :

మళ్లీ కాళ్లు మొలిచి తోక మాయమై పోతుంది....
అంత తమాషా ?

ప్ర తా ప్ :

నీముఖం ! తలకప్ప ఎక్కడైనా కప్పైపోతుందా?
అదివేరు....ఇది వేరు....

చం ద్ర :

నీ కింతేనా తెలిసింది .... కప్ప మొదట గ్రుడ్లు
పెట్టాక చాల రోజులకు పిల్లలు పెడుతుంది....

గం గా ధ రం :

(ప్రవేశించి) నన్నడుగురా! చెప్పుతాను. ఆ వెనుక
చేపలాగే ఉంటుంది. తలమాత్రం పెద్దదిగా

ఉంటుంది. నాలుగు కాళ్లు క్రమముగా పుడు తాయ్.... చివరికి తోక మాయమై కప్పైపోయి లక్....లక్....అని ఎగురుతుంది..,. (ఎగిరి చూపు తాడు....)

ప్ర తా ప్ :

శుద్ధ అబద్ధం....తల కప్పలు చచ్చినా కప్పలు కావు.

మనిషి కోతై పోతాడన్రా ? లేదా కోతి మనిషై పోతుందా ?

గ ం గా ధ ర ం :

మా మాస్టరు మొన్న చెప్పాడు. అసలు మనిషి కోతి నుండే పుట్టాడట. నీకు తోకలేదు కానీ ఉంటే నీవు తిమ్మన్నవే....

ప్ర తా ప్ :

నువ్వే తిమ్మన్న....

కోతీ కోతీ కొబ్బరికాయ్
కోతీమూతీ పరిందికాయ్
కుజ్జు కుజ్జు తిమ్మన్న
సలాం పెట్రా తోకన్నా!

(వెక్కిరిస్తూ పాడుతాడు)

చంద్ర :

తాతయ్యో! ఈ గంగాధరం గాడు చూడు.
(అందరూ గప్‌చిప్ మని కూర్చుంటారు....)

తాతయ్య :

(దగ్గుతూ) వస్తున్నా .... వస్తున్నా.... (ముగ్గురూ ఒక్కసారి పుస్తకములు తీసి చదువుతారు....)

గంగాధరం :

తల కప్పకు క్రమక్రమముగా తోక మాయమై పోయి కాళ్లు మిగులును....

ప్రతాప్ :

కప్పలు పదివేలు చేరు గదరా సుమతీ....

చంద్ర :

అప్పుడు రాజు మండూక సుందరితో నిట్లని వచించెను. "ఓ సుందరీ! నీమాట చొప్పున నడచు కొందును. నన్ను పరిణయ మాడుము."

తాతయ్య :

(ప్రవేశించి) ఏమిట్రా ఏమి జగడాలు.... వెధవలు.... మాస్టరు గారిని రానీ....

ప్రతాప్ :

అది కాదు తాతా! వీడంటాడు తలకప్పే తోక మాయమై కప్పైపోతుందట...

తాతయ్య :

అదేమిట్రా విచిత్రం! తలకప్ప ఎక్కడైనా కప్పై పోతుంది! నీ తలకాయ....ఎవడురా నీకు చెప్పింది?

గంగాధరం :

మా మాస్టరే చెప్పారు తాతా! ఈ పుస్తకంలో కూడా వ్రాశారు....

తాతయ్య :

ఏమని?

చంద్ర :

ఉండు తాతా....అద్దాలు తెస్తాను.... (లోపలికి పరుగెత్తుతాడు....)

తాతయ్య :

ఏం చదువులురా? కలికాలం చదువులు. ఏదో గజేంద్ర మోక్షమో, రుక్మిణీ కల్యాణమో కమ్మగా చదువుకోకుండా కప్పలు, తలకప్పలూ?

చంద్ర :

(అద్దాలు తెచ్చియిచ్చి) ఇదిగో తాతా....

తాతయ్య :

(పుస్తక మందుకొని కళ్లద్దాలు వేసికొని) కప్ప జీవితము బహు చిత్రమైనది. ఇది మొదట తోకతో పుట్టును. క్రమముగా నాలుగు కాళ్లు పుట్టిన వెనుక ఆతోక మాయమగును. (పుస్తకం మూసి) మాయమే! (ఆశ్చర్యాన్ని నటిస్తూ)

మాస్టరు :

(ప్రవేశించి) ఏమిటి బసవయ్య తాతగారూ! మను మళ్లకు పాఠాలు చెప్పడానికి కూర్చున్నారేం!

తాతయ్య :

రండి....రండి....సమయానికే వచ్చారు .... ఇదే మిటండి తలకప్పలు కప్పలౌతాయని వ్రాశారే?

మాస్టరు :

అవును మరి?

తాతయ్య :

అంతే నంటారూ! నా కిన్నేళ్లు తగుల బడ్డాయ్ నాకు తెలియదు గదటయ్యా

మా స్ట రు :

మీరెందు కు గమనిస్తారు లెండి. సృష్టిలో చిత్రాలు ఇంకా అద్భుతంగా ఉంటాయ్....

గ ం గా ధ ర ం :

సార్ ! సార్ ! గొంగళి పురుగు సీతాకోక చిలుకై పోతుంది గదండీ ?

తా త య్య :

ఏ మిటేమిటి ? గొంగళి పురుగు....

గ ం గా ధ ర ం :

సీతాకోక చిలుకై పోతుంది....

తా త య్య :

ఇంత అబద్ధం చెబితే నమ్మేవాళ్ళు ఉండవద్ద టరా.

మా స్ట రు :

అవును లేండి గొంగళిపురుగు నిద్రావస్థలో కొన్ని వారాలుంటుంది. ఆ వెనుక రెక్కలతో సీతాకోక చిలుకై పూలమీద వ్రాలుతుంది....

తా త య్య :

ఈ చిత్రం కూడ సత్యమే నంటా రూ? ఇంతకూ మా కాలంలో ఒక్కటీ తెలియదే....

చ ం ద్ర :

గ్రుడ్లు పెట్టి పిల్లలకు పాలిచ్చే జంతువు కూడా ఉంది కదండీ....

తా త య్య :

ఏందీ ? గ్రుడ్లు పెట్టడమేమిటి ? మఱల పాలివ్వ డమెమిటి ?

మా స్ట రు :

ఉన్నాయి లెండి....

తా త య్య :

ఏమిటండీ అంతా మాయగాఉందే .... మాతాత గారు పాటలు పాడేవారు .... అదికూడా నిజమే నేమో !

తూరుపు కొండపై కూరుచున్న
ది కోతి కోతికడుపులోన రామా !
మనిషి పుట్టాడంట మనిషి
కుండే తోక మాయమై నాదంట రామా !

(అంటుండగా తెర పడుతుంది....)

# నవనీతం!

పాత్రలు!

కృష్ణుడు

రాముడు

గోపాలుడు

కేశవుడు

వైకుంఠం

మాధవుడు

సింగారం

# నవనీతం!

(దశమి నాటి వెన్నెల .... ముగ్గురుపిల్లలూ చేరి వీధి లో ఓవైపు నేల మీద వెన్నెల కుప్పలు పోస్తుంటారు. ఒకని వద్ద ఇసుక మూట ఉంటుంది. మరి ద్దరామూటలో నుండి ఇసుకనెత్తి కుప్పలు కుప్పలుగా పోస్తుంటారు.)

కృ ష్ణు డు :

(మూటను క్రింద బెట్టి) ఊఁ కాని వ్వండి. తొందర తొందరగా....

రా ము డు :

నే నప్పుడే నలభై పోశాను.

గో పా లు డు :

నావి యాభై నాలుగు.

కృ ష్ణు డు :

నీ ముఖం....చిటికెలో ఇరవై ఆరు.... ఊఁ .... కానీ....

రా ము డు :

మాట్లా డకురా గట్టిగా కృష్ణా !

కృ ష్ణు డు :

నే నేం మాట్లాడినా వారికి వినిపించదు ఈ గోపి గానిదే గోల....

(తెలిలో....

వె న్నె ల్లో
స న్నా భీ....
వెన్నాముద్దలు
ఎ న్న బ్బీ....
వె న్నె లో సన్నాభీ
వెన్నా ముద్దలు
ఎన్న బ్బీ....)

కృ ష్ణు డు :

వె న్నె ల్లో
స న్నా భీ
వెన్నా ముద్దలు....(అని పాడి)

ఎన్ని చెప్పండిరా....
ఇన్నూరు....

రా ము డు :

(తెఅలో....

వెన్నా ముద్దలు
ఎన్న బ్బీ ?....)

కృ ష్ణ డు :

వె న్నె ల్లో
స న్నా భీ
వెన్నా ముద్దలు
ఇ న్నా ర బ్బీ....

(తెఅలో నుండి....

ఇ న్నారై తే
రండ బ్బీ....
వెన్నెల పువ్వులు
తెం డబ్బీ !....)

కృ ష్ణ డు :

లెండి....లెండి....లెండిరా పోదాం....

రా ము డు :

ఇటు....ఇటు....రా....

(ముగ్గురూ కుడివైపునుండి తెఅలోకి వెడుతారు....)

(ఎడమవైపు నుండి కేశవుడు, మాధవుడు, వైకుంఠం వస్తారు....)

మా ధ వు డు :

వెద కండిరా .... ఇక్కడే ఎక్కడో పోసి ఉంటారు....

వై కుం ఠం :

(ఓ మూలచూసి) ఇక్కడెక్కడా ఒక కుప్ప కూడా కన్పించ దే.

కే శ వు డు :

ఒరేయ్ వైకుంఠం....నీకు పగలే కళ్లు కన్పించవురా! ఇక రాత్రి పూట నీ ముఖం!ఏంతెలుస్తుంది?

వై కుం ఠం :

అవునవును. నీ కైతే....

కే శ వు డు :

చూడు....చూడురా....నీ ముందే ఎన్ని కుప్పలున్నాయో....

వై కుం ఠం :

(తొంగి చూచి) అవునురేయ్....ఒకటీ....రెండూ మూడూ....

మా ధ వు డు :

ఒరేయ్.... కేశవా....ఇదో ఇదో .... ఇక్కడో వందా....ఒకటి....రెండూ...మూడు...నాలుగూ...

కే శ వు డు :

మాధవా! మీ రిద్దరూ ఇక్కడ ఉండే వన్నీ తుడిపే యండి....నే నావైపు చూస్తాను....

(తెరలో....

వెన్నెలో సన్నాభీ....
వెన్నా కుప్పలు
ఎన్నబ్బి?....

మా ధ వు డు :

వెన్నెలో సన్నాభీ
వెన్నెల కుప్పలు.... (ఆగి)
ఎన్ని తుడి పారురా?

కే శ వు డు :

నేను నూటరెండు....

వై కు ం ఠ ం

ఇన్నూరని చెప్పరా....

మా ధ వు డు :

ఒకటి తక్కువ చెబుతాను....

వెన్నె కుప్పలు

వందా తెంబై తొమ్మిదీ....

(తెఱలోనుండి....గోపాలుడు, కృష్ణుడు, రాముడు వస్తారు. మాధవుడు, కేశవుడు, వైకుంఠం చేతులు దులుపుకొని లేచి నిలబడుతారు)

కృ ష్ణు డు :

వారగా రండీ. ఎన్ని మిగిలాయో ఎంచాలి....

గో పా లు డు :

ఒకటీ.... (అలా తిరిగి) ఇదో రెండు, మూడు, నాలుగు, ఐదు....

కృ ష్ణు డు :

ఇక్క డొక్కటి ఆరు.

రా ము డు :

ఇక్కడ నాలుగు....

కృ ష్ణు డు :

మొత్తం పది వెన్నముద్దలు....మీరు బాకీ....

మా ధ వు డు :

ఇక్కడికి చాలీరోజు ఆట. పది వెన్నెల కుప్పలు రేపు తీరుస్తాము.

కృ ష్ణు డు :

ఇప్పుడే కావాలి?

మా ధ వు డు :

ఎక్కడైనా దొంగిలించాల్సిందే!

రా ము డు :

కృష్ణుడనుకుంటే నిజంగానే దొంగిలిస్తాడు.

వై కుం ఠం :

అవు నవును. ఇదేం రేపల్లె గాదు. వెన్నముద్దలు దొంగిలిస్తే ముచ్చట పడ డానికి.

గో పా లు డు :

అనుకుంటే అదెంత పనిరా. నేను చెప్పినట్టు వినండి. నిమిషాలమీద వెన్న ముద్దలు వస్తాయి.

వై కుం ఠం :

ఏదీ చెప్పు చూద్దాం....

గో పా లు డు :

ఇది రేపల్లే అనుకుందాం....

వై కుం ఠం :

అనుకోనీ ?

గో పా లు డు :

కృష్ణుడు కృష్ణుడే అనుకొందాం....

కృ ష్ణు డు :

ఆఁ....

గో పా లు డు :

కృష్ణా మీ అత్తగారి పేరు రాధమ్మ గారే కదూ.

మా ధ వు డు :

సరిగ్గా కుదిరిందే....ఎలా పెట్టార్రా ఈ పేర్లు?

వై కుం ఠం :

రాధమ్మగారింట్లో వెన్నముద్దలను దొంగిలించడం అంతేనా ?

గో పా లు డు :

ఆ కాలం కృష్ణుడు వెన్నముద్దలు....ఈ కాలం కృష్ణుడు....?

కృ ష్ణు డు :

మా అత్తో ళ్లిం ట్లోనే వెన్న ముద్దలు లేవనా ?

వై కుం ఠం :

ఐతే ఇకనేం....

కృ ష్ణు డు :

చప్పుడు చేయకుండా నా తో రండి. ఒక్క వెన్న లేమిటి ఖర్మ....ఇంకా పేలపిండి .... కొబ్బరి కాయలు...మామిడిపళ్లు.... అన్నీ కా జేయొచ్చు

మా ధ వు డు ;

ఐతే మన పంట పండిం దన్నమాట.

గో పా లు డు ;

ఇప్పుడు శ్రీకృష్ణుడు రాధమ్మ ఇంటిలో వెన్న ముద్దలు దొంగిలించ బోతున్నాడు. కృష్ణా.... చొక్కాను విప్పివేసి ఇదో నీలం సుద్ద ముక్కను కాస్త ముఖానికి రాచుకో....

కృ ష్ణు డు :

చిత్తము, (చొక్కా తీసి నీలిరంగు పూసుకుంటాడు)

గో పా లు డు :

మిగిలిన వారం దరూ గోపాలురు. రాముడు మాత్రము బలరాముడు.

రా ము డు :

నేనే రంగు వేసుకోవాలి.

గో పా లు డు :

వున్నరంగు చాల్లే .... అందరూ చొక్కాలు తీసి వేయాలి. రేపల్లె గొల్ల పిల్లలకు చొక్కాలు లేవు.

వై కుం ఠం :

ఆ మాటకు వస్తే అసలు వారికి షరాయిలు కూడా లేవు! బొమ్మల్లో చూడూ కృష్ణుడు పంచకట్టు కొన్నాడు.

గో పా లు డు :

షరాయిలుంటే ఫరవాలేదు, చొక్కాలు మాత్రం విప్పేయండి.

మా ధ వు డు :

ఈ బట్ట లన్నీ ఎక్కడ పెట్టాలి ?

గో పా లు డు :

మూటకట్టి నీవద్ద ఉంచుకో

మా ధ వు డు :

అడిగిన దానికి శిక్ష....?

కృ ష్ణు డు :

అందరూ రెడీ అన్నమాట (అందరూ చొక్కాలు విప్పి సిద్ధమవుతారు, కొందరు ముఖాలకు సుద్దరంగులు పూసుకొని ఉంటారు.)

రా ము డు :

కృష్ణా! ఇక వెడలుదమా!

కృ ష్ణ డు :

ఆహా! ఇదో....

వెడలే శ్రీ కృష్ణుడిది గో
వెడలే....
వెడలెను కృష్ణుడు
పుడమి వడంకగ....
వెడలెను....

అ ం ద రు :

కృష్ణుడు

కృ ష్ణ డు :

పుడమి

అ ం ద రు :

వడం కగ

కృ ష్ణ డు :

వడి వడి నడు గిడి
కడు వేగముతో....

అ ం ద రు :

వెడలెను కృష్ణుడు
పుడమి వడంకగ
వడి వడి నడు గిడి
కడు వేగముతో....

కృ ష్ణ డు :

వన్నెల కృష్ణుడు
వెన్న ముద్దలను

అ ం ద రు :

వెన్న ముద్దలను

కృ ష్ణ డు :

చిన్నెల జూపుచు
చిన్న చిన్నగా
దొంగి లించుటకు
చెంగున గెంతుచు....

అ ం ద రు :

వెడ లెను శ్రీకృష్ణుడు
వెడలెనూ....
చిన్నెల జూపుచు

వెన్న ముద్దలను
దొంగిలించుటకు
చెంగున దుముకుచు

(అని పాడుతు లోపలికి వెడతారు....)

[ తెఅ పడుతుంది ]

(లోపల పైపాట విన్పిస్తుంటుంది.... తెఅ తీయగనే.... ఒక కుక్కి మంచంమీద తాతయ్య పడుకొని ఉంటాడు.... ఉట్టిలో వెన్నముద్దల మట్టిపాత్ర ఉంటుంది మరోమూల బుట్టలో మామిడి పళ్లుంటాయి. కృష్ణుడు తదితరు లొక్కొక్కరే ప్రవేశిస్తారు.)

కృష్ణుడు :

కిక్కురమన గూడ దెవ్వరు. మా రాధత్త పక్క గదిలోనే పడుకొని ఉంది. ఆవులిస్తే పేగులు లెక్కబెడుతుంది.

గోపాలుడు :

ముందు అయ్యే పని చూడు.

వైకుంఠం :

అయ్యే పనే ముంది. ఆనాడు కృష్ణు డెక్కినట్లుగా ఒకరి మీ దొకరిని నిలబెట్టి ఎక్కవలసిందే.

మా ధ వు డు :

అలా గెందుకూ? చిన్న సర్కస్సు చేస్తే సరి పోతుంది,

రా ము డు :

నువ్వు మెల్లగా మాట్లాడు....

కే శ వు డు ;

వాడి గొంతే గోండ్ర కప్ప గొంతు.

మా ధ వు డు :

ముందు నలుగురు నిలబడాలి. చేతులు కూర్చు కోండి....

రా ము డు :

ఆ లెక్కన ఏడుమంది కావాలి.

వై కుం ఠ ం :

వసారాలో సింగారం పడు కొని ఉన్నాడు. లేపు కొని వస్తే.

సిం గా ర ం :

(లోనికి వస్తూ) నేను చూస్తూనే ఉన్నాగా మీ దొంగ తన మంతా. అమ్మతో చెప్పా నంటే చర్మం ఒలిచేస్తుంది.

కృ ష్ణు డు :

అమ్మ పక్క గదిలో నిద్రపోతోంది గద్రటా....

సిం గా ర ం :

నీ ముఖం! రచ్చబద్గరు కృష్ణ లీల హరికథకు వెళ్లిందిరా....

మా ధ వు డు :

ఇది మరీ బావుంది. రాధత్తమ్మ కృష్ణ లీల హరి కథకు వెళ్లింది. కృష్ణుడేమో వెన్నముద్దలు దొంగతన చేస్తున్నాడు.

వై కుం ఠ ం ;

ముందు పని కానివ్వండి....రాధత్తమ్మ రాక ముందే వెళ్లకుంటే బడిత పూజలే.

మా ధ వు డు :

ముందు నలుగురు నిలవండి. సింగారం, కేశవుడు గోపాలుడు, రాముడు....

(నలుగురూ చేతులు కూర్చుకొని నిలబడతారు వలయంగా)

వై కుం ఠ ం :

మళ్లీ?

మా ధ వు డు :

మన మిద్దరం వారిమీద నిలబడాలి.

వై కుం ఠం :

ఐతే కానీ....

(ఇద్దరూ ఆ నలుగురి భుజాలమీద నాలుగు కాళ్ళు పెట్టి చేతులు కూర్చుకొని నిలబడతారు).

మా ధ వు డు :

కృష్ణా పై కెక్కరా!

కృ ష్ణు డు :

(వారి మీద నెక్కి. మాధవుడు, వైకుంఠం భుజాలమీద నిల బడుతాడు)

మా ధ వు డు :

అందుతోందా?

కృ ష్ణు డు :

ఆఁ....ఎందు కందదూ!

వై కుం ఠం :

దించుకో....దించుకో....

కృ ష్ణు డు :

(వెన్నచట్టి నెత్తుతుండగా తెఅలో తలుపుతట్టిన చప్పుడు..)

శ్రీ కం ఠం

(తెఅలో నుండే) ఒరేయ్ సింగారం .... తలుపు తియ్....

కృష్ణుడు:

రాధత్త....రాధత్త....రే....

సింగారం:

దిగు....దిగు....

శ్రీకంఠం:

(తెరలోనుండి) ఎంత సేపురా....మొద్దు నిద్ర....

సింగారం:

గురకపెట్టి, ఆఁ యెవరదీ?....

శ్రీకంఠం

తలుపుతియ్....

ముసలాడు:

(మంచంపై అటూ ఇటూ పొర్లుతాడు....)

మాధవుడు:

ఉండండి....ఇప్పుడెట్లా? (చేతులు గుద్దు కొంటాడు)

వైకుంఠం:

(వెన్నతింటూ) ఎటూ దెబ్బలు తప్పవు....

గోపాలుడు:

శుద్ధ దద్దమ్మలు....

రా ము డు :

నా కొ్కంచం యివ్వరా....(లాకొ్కంటాడు చట్టిని..)

శ్రీ కం ఠం :

(తెరలో) వినబళ్లేదూ? ఏం నిద్రరా పాడు నిద్ర ?

మా ధ వు డు :

(అటూ యిటూ చూచి ఒక్కొక్కరినో మూల దాచిపెడు తాడు.)

కృ ష్ణ డు :

అక్కడ తలుపు తియ్యగానే మీరు చీమ చిటు క్కు మనకుండా మెల్లగా బయటికి జారు కోవాలి....

శ్రీ కం ఠం :

(తెరలో) తెలిసిందిరా....కృష్ణా....ఇదా కథ....

కృ ష్ణ డు :

నేనేం చేయలే దత్తా ! అంతా సింగారమే.... (అని అందరినీ సైగచేసి మెల్లగా....) రండి....రండి. పెరటి దో వుందిగా....(అని తెరలోకి వెడు తాడు. అందరూ అనుకరిస్తారు. సింగారం అక్కడే ఉండగా తెర పడుతుంది....)

....తెరలో....

స్త్రీ గొంతు :

ఎక్కడరా వాళ్ళంతా ?

సింగారం :

పరుగెత్తారే....

స్త్రీ గొంతు :

వెన్నంతా తినేశారూ ? .... ఈ మామిడి పళ్ళేవీ ?

సింగారం :

వాళ్ళే తీసుకున్నారు.

స్త్రీ గొంతు :

నువ్వు చూస్తూ వుంటివేం....(కొట్టిన శబ్దం .... సింగారం ఏడ్చిన శబ్దం....)
తెఱ ఎత్తగానే....
(కృష్ణుడు మొదలైనవారు తలో మామిడిపండు తింటూ...)

కృష్ణుడు :

వెడలెను శ్రీకృష్ణుడు....వెడలెను....

అందరు :

రాధమ్మ ఇంటి నుండి
రాగాలు దీసు కొంటూ

మంచి మామిడి పళ్ళ
మాధుర్యము జుర్రు కొంటూ

కృ ష్ణు డు :

వెడలెను శ్రీ కృష్ణుడు
వెడలెను....
మా పల్లె రేపల్లె

రా ము డు :

ఆగరా....ఆగారా....అక్కడ వచ్చేది పంతులు గారే కదూ?

కృ ష్ణు డు :

లెక్కల మాస్టారేయ్! చూస్తే పక్కెముకలు యించేస్తాడు....

మా ధ వు డు :

పరుగో పరుగూ.... (అందరూ పరుగిడు తుండగా తెర.)

—(o)—

# మా జండా!

## పాత్రలు

సాత్యకి

మూర్తి

సుశీల

శారద

శేషాద్రి

జానకిరాం

నలుగురు సిపాయిలు

# మా జం డా!

[గదిలో నలుగురు పిల్లలు కేరమ్సు ఆడు కుంటుంటారు.... శారద ప్రక్కన కూచుని చూస్తుంటుంది.]

సా త్య కి

(గురిచూచి) ఈ దెబ్బ పడిందను కో....

మూ ర్తి :

ఊఁ....కానీ....

సు శీ ల :

కానీ మరి

సా త్య కి

(కొడుతాడు....గురి తప్పుతుంది) అరెరే!

శే షా ద్రి :

ఇదేం గోలీలాట కాదురా!

సా త్య కి :

కానీ రాన్నా....కానీ....

జా న కి రా మ య్య :

(ప్రవేశించి) ఒరేయ్ మిమ్మల్నే .... ఈ రోజూ ఊళ్లో చాలా అల్లరిగా ఉంది. ఇంట్లోనే భద్రంగా ఆడుకోండి.

శా ర ద :

ఏ మల్లరి నాన్నా?

జా న కి రా మ య్య :

నీకెందుకు? కాంపౌండు దాటారంటే చెవులు నులిమేస్తాను. (ఇంటిలోపలికి చూచి) వస్తానే.... చూచుకో....వీళ్ళ నోకంటితో కు(రకారు. ఊళ్లో ఒన్ ఫార్టీఫోర్ బనాయించారు. (వెళ్లిపోతాడు గొడుగును తెఱచుకొంటూ)

శా ర ద :

ఒన్ పార్టీ ఫోర్ అంటే ఏమిటన్నా య్యా!

సా త్య కి :

అదేదో రూలులే....ఎవరూ వీధుల్లోకి వెళ్లకూడదు

శా ర ద ;

ఎందుకూ?

శే షా ద్రి :

ఎందుకా? నీకింకా తెలియదేం? గాంధీతాతను జెయిల్లో పెట్టారని తెలియ దూ?

శా ర ద :

జెయిల్లో ఎందుకు పెట్టారు?

మూ ర్తి :

స్వరాజ్యం కావాలంటే జెయిల్లో పెట్టారు....

శా ర ద :

స్వరాజ్య మంటే....

సు శీ ల ;

ఆ మాత్రం తెలియదూ? మన రాజ్యాన్ని మనమే పాలించుకోవడం.

మూ ర్తి :

ఇప్పుడు ఇంగ్లీషువాళ్లు పాలిస్తున్నారు గదా! వాళ్లను వెళ్లిపొమ్మంటున్నారు మనవాళ్లు.

శా ర ద :

వాళ్లదే ఊరు ?

సు శీ ల :

ఇంగ్లాండు దేశం. అదిక్కడికి ఆరువేల మైళ్లు.

శా ర ద :

అమ్మయ్యో! అంత దూరం నుండి ఎలా వచ్చారు ?

మూ ర్తి :

ఓడలు, విమానాలు ఎన్నిలేవు ?

శా ర ద :

వాళ్లందరూ చేరి ఎందరుంటారు మనదేశంలో....

సా త్య కి .

లక్షమంది ఉంటారేమో !

మూ ర్తి :

ఇంక ఎక్కువే ఉండవచ్చు.

శా ర ద :

పోనీ మూడు లక్ష లుంటే మాత్రం మనవాళ్లెంద
రుంటారు ?

సా త్య కి :

నలభై కోట్లు.

శా ర ద :

ఈ నలభై కోట్ల మందినీ ఈ రెండు మూడు
లక్షలమంది పాలిస్తున్నారేం ?

సా త్య కి :

అందుకే గాంధీతాతఅన్నాడు, మావాళ్లకు కోపం
వస్తే పచ్చడి చేస్తారయ్యా ! ముందుగానే మూటా
ముల్లే సర్దుకోండనీ.

సు శీ ల :

ఇన్ని కోట్లమంది ఉండీ గాంధీతాతను జెయిల్లో పెడితే నిద్ర పోతున్నారుగా.

శే షా ద్రి :

అంతే నీకు తెలిసింది. మనవాళ్లేం గొఱ్ఱెలను కున్నావ్ నిన్న పేపర్లో చూడలేదూ ?

శా ర ద :

ఏమి చేశారు ?

శే షా ద్రి :

పెద్ద పెద్ద స్టేషన్లన్నీ ధ్వంసం చేసేశారు. గూడ్సు బండ్లను పట్టి కొట్టించారు.

సా త్య కి :

మొన్న పేపర్లో ఇంకో తమాషా వచ్చిందిరా.... ఒకాయనేమో జబర్దస్తీగా వచ్చి ఊరేగింపు జరక్కూడ దన్నాడట.

శా ర ద :

అంటే....

శే షా ద్రి ;

అతన్నే పట్టుకొని వేపాకులు కట్టి ఊరేగించారు.

సు శీ ల :

ఉద్యోగస్తులంతా ఇంగ్లీషువాళ్ల పక్కగదా!

సా త్య కి :

ఛాఛా....పైకి మాత్రమే. లోపలేమో గాంధీ తాత పక్కే....

శా ర ద :

గాంధీ తాత ఏం చెప్పాడు?

శే షా ద్రి :

విద్యార్థు లెవరూ బడికి పోకూడదని చెప్పాడు.

సా త్య కి :

పోకుంటే మాస్టారు కొట్టడూ?

శా ర ద :

బడికి పోకుండా ఏం చేయాలని....

శే షా ద్రి :

ఇంగ్లీషోళ్లు వెళ్లిపోవాలంటూ ప్రచారం చేయమన్నాడు....

శా ర ద :

ఐతే మనమూ ప్రచారం చేద్దాం....

సా త్య కి :

మనం ప్రచారం చెయ్యాలంటే జండా కావాలి!

సు శీ ల :

జండా మాయింట్లో ఉంది.

శే షా ద్రి :

జండా కన్పిస్తే సిపాయిలు చూశారంటే కాల్చేస్తారు!

శా ర ద :

మనమేం మిడతలా పిట్టలా....వెళ్ళవే సుశీలా జండా తీసుకురా.

సా త్య కి :

నాన్నగారేం చెప్పారో జ్ఞాపక ముందా ?

సు శీ ల :

నువ్వు కూర్చో ఆడంగిలాగా యింట్లో ! మేము పోతాం....

సా త్య కి :

నేనా ఆడంగిని....సిపాయిటోపీ చూస్తే పరుగెత్తే వారు మీరు నన్ను ఎగతాళి చేస్తారేం?

మూ ర్తి :

ఉత్తమాటలెందుకూ? నడవండి పోదాం....

(అందరూ తెఱలోకి వెడుతుండగా తెఱ పడుతుంది.... లోపలనుండి పాట....)

స్వతంత్రభారత దేశమంతయును
సమర భూమియయ్యెన్

పాలు గుడుచు పసి పాప లేచెను
పౌరుష ముప్పొంగెన్

వెళ్లిపొండి మా యెల్ల దాటియని
విప్ల వాగ్ని చిలికి

ప్రళయ రుద్రులై విజృంభించిరి
ప్రజలందరు లేచి....

....తెఱతీయగనే....

(శారద, సుశీల, సాత్యకి, మూ ర్తి, శేషాద్రి వరుసగా ప్రవేశిస్తారు. శారద చేతిలో జండా వుంటుంది. మరో ఐదారుగురు పిల్లలుంటారు....)

శా ర ద :

ఇక్కడేగా నిన్న జండా నాటిఉంటే పీకి పారేశా రన్నారు,

సా త్య కి :

ఔనౌను. నేను నాటుతా నుండు.

మూ ర్తి :

ఏ మగవాడు వస్తాడో రానీ....మన నేల మీద మన జండా నాటుకుంటే వీళ్ల కేం?

శే షా ద్రి :

వాళ్ల తాత సొమ్మనుకున్నారు పాపం!

శా ర ద ;

అదో....అదో....వాళ్లేగా సిపాయీలు....

సా త్య కి :

ఒక్కరూ కూడ భయపడకండి

సు శీ ల :

వాళ్ళ ముఖం....వాళ్లేం చేస్తారు? అంతా బెదిరింపులే....

మూ ర్తి :

మనకూ పిస్తోళ్లు తుపాకులుంటే వీళ్ళపని బడుదుము కానీ....

శే షా ద్రి :

ఇప్పుడు మాత్రమే. అనుకుంటే వీళ్లొక లెక్కా..

సు శీ ల:

మీరెవ్వరూ వాళ్ళను మాట్లాడించకండి. మనజోలికి వచ్చినప్పుడు చూద్దాం.

మూ ర్తి :

మనం జేలు కొడుదాం—

శా ర ద :

మన జండా నాటుముందు....

(అందరూ జండా చుట్టూ కూచుంటారు....)

(నలుగురు సిపాయిలు ప్రవేశిస్తారు....)

మొ ద టి సి పా యి :

ఒహో!....హో ఇక్కడో సమావేశం జరుగుతున్నట్టుందే....

రెండవ సిపాయి :

ఏదో పిల్లాళ్ళు ఆడుకుంటున్నారు. రేయ్ ఎందుకిక్కడ గుంపు చేరారు?

(ఒక్కరూ పలుకరు....)

మూడవ సిపాయి :

ఎవరికీ నోరులేదూ? కదలరేం....ఆ జండా పీకేయండి....

శా ర ద :

జండా దగ్గరకొస్తే (లేచి)

మూడవ సిపాయి :

వస్తేనేం....

సాత్యకి :

ఎందుకొస్తావ్? ఇది మా జండా.

రెండవ సిపాయి :

అందుకే ఎత్తుకెళ్లి పెట్టెలో దాచిపెట్టుకో నాయనా....ఇక్కడ నాటితే తుపాకులతో కాలుస్తారు తెలుసా?

శా ర ద :

కాలుస్తారు....కాలుస్తారు....

మొదటి సిపాయి.

ముందు ఈ చోటు వదలి వెళుతారా లేదా?

సు శీ ల :

వెళ్లం.

మొదటి సిపాయి :

మాట్లాడితే పేల్చేస్తాను. (పిస్టల్ తీస్తాడు)

శా ర ద :

ముందు నన్ను కాల్చు....

రెండవ సిపాయి :

(ముందుకువచ్చి జండాను పీకబోతాడు. శారద అడ్డుపడితే నేలకువేసి కొడుతాడు. శారద జండావదలదు. పిల్లలంతా జండాను గట్టిగా పట్టుకొంటారు చుట్టూ చేరి)

మొదటి సిపాయి :

రెండు నిమిషాల్లో వదలి పోకుంటే కాల్చేస్తాను,

శా ర ద :

రెండేండ్లైనా వదలి పోము.

సు శీ ల :

కాల్చండి చూద్దాం.

సా త్య కి :

టపాకాయలనుకున్నారు పాపం....

మొదటి సిపాయి :

(పైకి కాలుస్తాడు)

శా ర ద :

మనుష్యులను క్రిందపెట్టుకొని పైకి కాలుస్తున్నా వెందుకూ?

రెండవ సిపాయి :

యు షటప్ సిల్లీగర్ల్ వెడుతారా లేదా?

శారద :

వెళ్లం.... ఈ అడుగు కదపం.... కాలుస్తా నన్నా వుగా....

మొదటి సిపాయి :

కాలుస్తున్నాను.

శారద :

కాల్చే ముఖమే....

మొదటి సిపాయి :

(కోపంతో పేలుస్తాడు పిస్టల్) (శారద నేలమీద ఒరుగుతుంటే.... తెలుపడుతుంది....లోపల పాట....)

పాలు త్రాగు పసిపిల్లల రక్తము
ప్రవహించిన దా నాడు....
చిందిన నెత్తురు ఫలము స్వరాజ్యము
చేతికందిన దది నేడు,...
బానిస కూటిని ముట్టలేదు మన
పాపలు సైతము నాడు
దేశభక్తులై కీర్తి తెచ్చెదరు
తెలుగు బాలలు నేడు!

ఎంద రెందరో మహా యోధులు
వందలు వందలు నాడు
సుందర మూర్తులు ముద్దు పాపలు
ముందు కురి కిరా నాడు
దోగాడెడి పసిపాపలు కదనము
సాగిం చిరి యానాడు
ఊగి పోయెనా సేతు శీతనగ
ముద్రే కంబున నాడు
సమరచరిత్రము చదువబూనితే
అమర వీరులానాడు
సమ రాగ్నులలో సమిధలై రి ని
స్వార్థమూర్తు లానాడు !
నాటి ఫలితమే విశ్వశాంతికి
నాందియైన దీనాడు
కోటి గొంతులతో కీర్తించండి
సాటి లేని వీరుల నేడు.



---

ఆంధ్రా ప్రింటర్సు, విజయవాడ-2.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA121B184 |
| పుస్తకం పేరు | పరీక్షాఫలితాలు |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 89 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 50 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | MUNISHA |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |